బొడ్డు రామయ్యా అండు కంపెనీ

ప్రకటితము.

విశాఖపట్టణము:

శ్రీ శారదామకుటముద్రాక్షరశాలయందు

ముద్రితము.

౧౯౧౩

ఆల్ రైట్స్ రిజర్వ్డు.






శ్రీ

# నీతిగీతితతి

(తేటగీతులు.)



శ్రీమతీశ! హృషీకేశ! • ధృతధరేశ!
నిఖిలదేవార్చితచరణ! • నీదుకరుణ
చేత నీతిగీతితతి ర • చింపఁబడును
బాలికాబాలహర్షణా • వహము గాఁగ.

ప్రకృతిబద్ధత మనకు నీ • శ్వరుఁడు గానఁ
బట్టుమి నతండు లేఁడని • పలుకఁ దగునె?
భానురశ్మిఁ దారక లగ • పడక యున్న
నవ్వి మింటను లేవని • యనఁగ నగునె? ౨

బ్రహ్మ మన హరి యన శూల • పాణి యనఁగ
'గాడ'నఁగ 'ఖుదా' యనఁగ నొ • క్కరుఁడె కాఁడె?
దుగ్ధ మన 'మిల్కు'నంగను • 'దూద' నంగఁ
బాలనఁగ మాటలే వేఱు • వస్తు వొకఁడె. ౩

జగము రంగస్థలము; జంతు ♦ సమితి పాత్ర
గణము; బ్రతుకుందెరువు నాట ♦ కంబు; దీర్ఘ
నిద్రఁ జెందుట నిష్క్రాంతి; ♦ నిక్క మరయ
సూత్రధారుండు త్రిభువనే ♦ శుండు సుమ్ము. ౪

స్థూల మగునీప్రపంచంబుఁ ♦ దొలుత నెఱిఁగి
సూక్ష్మ మగు నాత్మ నెఱుఁగ నెం ♦ చుము పిదపను:
అలవసిష్ఠనక్షత్రంబుఁ ♦ దెలిసినతరు
వాతనె యరుంధతిఁ దెలియు ♦ బాలకుండు. ౫

శిష్యునంతఃకరణముల ♦ స్వీయబుద్ధి
చేతఁ గని తత్త్వము నుపదే ♦ శించు గురుఁడు:
ప్రాణితనువులోపలిరుజ ♦ వైద్యుఁ డెక్స
రేసు' నం గని తత్ప్రతి ♦ క్రియ సలుపఁడె? ౬

జ్ఞాన ముదయించునంతన ♦ జ్ఞానము జన
సంఘమును బాసి దవ్వుగాఁ ♦ జనుట నిజము:
ఇనుఁడు దోఁచినతోడనే ♦ యెసఁగి యున్న
యంధకారంబు చనదె? యీ ♦ యవని విడిచి. ౭

భాగవతు లెటువంటియ ♦ వస్థఁ గన్న
వారి కుంచనిశ్చలమైన ♦ భక్తి పోదు:
చెఱకు వంక యైనను దీపి ♦ చెడునె? పసిఁడి
ముక్క లయినను మూల్యంబు ♦ దక్క వగునె? ౮

[stamp]

పరమభక్తులతోఁ గూడి ♦ పరఁగుచున్న
పామరుఁడు పొందఁజాలఁడు ♦ భక్తిరసము:
నీరనిధి నెన్నినాళ్ళు ము ♦ నింగి యున్న
గండశైలము గొనదొక్క ♦ కణము నైన. ౯

ఏకమతమును బూనక ♦ నేకమతము
లూన నెంచెడు దుర్మతి ♦ యొందుఁ జెడుగు:
రెండునావలమీఁదను ♦ రెండడుగులు
నిలిపి నిలిచెడుమూర్ఖుండు ♦ నీట మునుఁగు. ౧౦

మన మయస్సార ఖడ్గస ♦ మాన మగయ
విఱిగిన నొకప్పుడయ్యది ♦ మఱి యతుకదు:
దాని మఱియొకగతిఁ గూర్పఁ ♦ బూనుకొన్న
సద్ది యుపయోగరాహిత్య ♦ మగును గాదె? ౧౧

ఎప్పు డెయ్యది యుక్తమో ♦ యప్పు డద్ది
గణ్య మగు; వేఱొకప్పుడు ♦ గర్హిత మగుఁ:
గర మలంకరించుకొనుట ♦ తరుణి కొప్పుఁ
గాక, వృద్ధకు నపహాస ♦ కరము గాదె? ౧౨

పనికి వచ్చెడివస్తు వ ♦ ల్పపుదియైన
దానినే గొప్పగా నెంచు ♦ మానవాళి:
గోపకుఁడు లేఁతగడ్డిని ♦ గొప్ప సేయుఁ
గాదె పట్టుదారంబుల ♦ కంటె నెపుడు?. ౧౩

గిరిగుహాముఖంబునఁ బల్కు • గిరలు మాఱు
మ్రోయువిధమునఁ దనమన • మున నరుండు
పరులకుఁ దలంచుహానులు • వచ్చుఁ దనకె;
కానఁ గోరరా దొరులకు • హాని నెపుడు. ౧౪

ఉసురు లేనిభస్త్రికనుండి • యొదవుగాలి
సలుపు చుండ లోహంబు భ • స్మంబు గాఁగ
సాధువుల రెండుశ్వాసకో • శములనుండి
వెలుగునిట్టూర్పడఁపదె త • త్కారకు ఖలు? ౧౫

మానిసికిఁ దలంపున లేని • మంచిచెడ్డ
లొదవు సౌభాగ్యదౌర్భాగ్య • పొరలందు:
వినమె సుగ్రీవునకు దార • తన మొదవుట,
మఱియు వసుదేవునకు నాఁడు • చెఱ గలుగుట? ౧౬

ఎన్నిసుగుణంబు లొప్పుచు • నున్నఁ దగిన
విద్య లేనినరుండు శో • భితుఁడు గాఁడు:
లలితరూపంబు గల్గుప • లాశసుమము
గంధహీనత బుధులపొ • గడ్త గనునె? ౧౭

విద్య నరునిగుణంబును • వృద్ధి పేయు;
దాని మార్పఁ జాల దొకింత • యైనఁ గాని:
సాన రత్నంపుఁగాంతి నె • సంగఁ జేయుఁ
గాక, దానిజాతిని మార్పఁ • గలదె యెందు? ౧౮

తన ప్రమాణంబు దెలియదు ♦ తనకు సరిగఁ
దెలియు నయ్యది యన్యుల ♦ వలనఁ జుమ్మి:
తనమొగంబు చూపట్టదు ♦ తనకనులకు;
నద్ది గనుపట్టు స్వచ్ఛంపు ♦ టద్దమందు. ౧౯

గొప్పవానిని భరియింప ♦ గొప్పవాఁడె
తగును; సామాన్యమనుజులు ♦ దగరు సుమ్మి:
తిమిని భరియింప సంద్రమే ♦ యమరు; నితర
నదులు మీనాకరంబులై ♦ నను నమరవు. ౨౦

రసికుఁడె గ్రహించుఁ గావ్యంపు ♦ రసము; దాని
నితరజనులు గ్రహింప లే; ♦ రిది నిజంబు:
మధుకరమె యెఱుంగు మరంద ♦ మధురిమంబు;
వన్యఖచరంబు లెఱుఁగునే ♦ యవని దాని? ౨౧

పండితుని శ్రమ మెఱుఁగును ♦ బండితుండు;
దాని నెఱుఁగఁడు మూర్ఖుండు; ♦ తథ్య మిద్ది:
దాదిఁ బథికకష్టము బాల ♦ సారి గాక,
యింటఁ గుడిచి కూర్చుండువాఁ ♦ డెఱుఁగు టెట్లు?

తనకుఁ గొన్నిలోపంబు లు ♦ న్నను బుధుండు
తరము పూజింపఁ బడుఁ జుమీ ♦ ధరణియందు:
క్షీణతయుఁ గళంకంబు లె ♦ క్కింపఁ బడక
శశధరుఁడు పూజితుఁడు గాఁడె ♦ జనులచేత? ౨౩

జాలి నెదను, బారుష్య మా ♦ స్యంబునందుఁ,
దొడరి వీరుఁ డప్రాప్యుండు ♦ దుర్మదులకు:
లోన మృదిమముఁ, గఠినతఁ ♦ బైని, బూని
నారికేళ మప్రాప్యంబు ♦ నగగములకు. ౨౪

నియమమును బాయ కుండుట ♦ నియతి; కాన
నేమమును బట్టి నడువుము ♦ నీ వెపుడును:
నియమమును దప్పకయె పద్మి ♦ నీవిభుండు
ఖంబునఁ జరించుచుండుటఁ ♦ గాంతువు గద! ౨౫

పండితుం డైన, మఱి భూమి ♦ పాలుఁ డైన,
మెలఁగవలె లోకనిందకు ♦ మిగుల జడిసి:
ధీరుఁ డగు రామనరపతి ♦ దెగడునకును
వెఱచి వని కంపెఁ బరమప ♦ విత్రఁ బ్రియను. ౨౬

నీచగుణయుక్తి మనుజుండు ♦ నీచుఁ డగును;
నీచజీవికచేఁ గాఁడు ♦ నింద్యుఁ డెపుడు:
దుష్టగుణరాశి—రారాజు ♦ దూఱఁ బడఁడె?
నలుఁడు హయపాలుఁ డయ్యుఁ గ♦నండె నుతులు?.

ఉచ్చదశవెనువెంటనే ♦ యుండు నీచ
దశ యని యెఱింగి గర్వింపఁ ♦ దగదు రాజు:
పెంపునం బ్రజ్వలించుదీ ♦ పంపునడుగు
నందె నీడను గనుఁగొన ♦ నగును గాదె? ౨౭

సుఖమునకు వెన్క దుఃఖంబు, ♦ సుఖము దుఃఖ
మునకుఁ దరువాతఁ గలుగుట ♦ పుడమి నియతి;
వెన్నెలకు వెన్కఁ జీఁకటి, ♦ వెన్నెల యొగిఁ
జీఁకటికి వెన్క వచ్చుట ♦ సిద్ధము గద! ౨౯

అధమునకు నుత్తముండు మఱి ♦ యధముఁ డుత్త
మునకు జన్మించుటయు నగు ♦ భూమియందుఁ:
జన్నవిత్తనమున గొప్ప ♦ చెట్టు మఱియుఁ
బెద్దచెట్టునఁ జిఱుపండు ♦ వెలయుఁ గాదె? ౩౦

తాను గష్టము పడియు ని ♦ తరుల కధిక
సుఖము గలుగంగఁ జేయును ♦ సుజనుఁ డెపుడు:
క్షారవిషమును దాఁ గ్రోలి ♦ జంతుతతికి
నమలజీవన మొసఁగుఁ గ ♦ దా ఘనుండు. ౩౧

ధీరజనుని వాగ్దానంబె ♦ స్థిరము; కాని,
నీచుమాటకు నుండునే ♦ నిల్కడ యెట?
శిలను లిఖియించు వర్ణాళి ♦ స్థిరము; కాక,
నీటిపై వ్రాయువర్ణాళి ♦ నిలిచి యున్నె? ౩౨

జనసమూహంబు వెఱచుఁ దే ♦ జస్వి కెపుడు;
నలుసుపాటియు నిస్తేజు ♦ నకు వెఱవదు:
అగ్నిఁ గాంచిన మానవుం ♦ డడలుఁ గాక,
బొగ్గుఁ గాంచిన నడలునే ♦ పౌ వ్వె నొంది? ౩౩

మనము దలఁపనిపని గూడ ♦ మనకరములు
చేతనే యొకానొకతఱిఁ ♦ జేయఁ బడును:
కుజమును యథేచ్ఛఁ గీటంబు ♦ గొఱుకు చుండఁ
బరఁగఁ గొన్నియక్షరము లే ♦ ర్పడును గాదె?

దక్షుఁ డగువాఁడె కార్యసా ♦ ధనము చేయు;
నధముఁ డెన్నఁడు దానిఁ జే ♦ యంగ లేఁడు:
సత్య మగుపిల్లి యెలుకలఁ ♦ జంపుఁ గాని
చంపఁ గలుగునె మంటితో ♦ సలుపుపిల్లి? ౩౫

కార్యసాధనమున శక్తి ♦ గలుగువాని
కంటెఁ బక్షము గలవాఁడు ♦ గరము హెచ్చు:
సబలహారి పక్వఫల మొందఁ ♦ జాల దకట!
పడయు దానిని ఖగము స ♦ పక్ష మగుట. ౩౬

దేని నైనఁ జేసిన నెచ్చు ♦ గాను జగ
హానికర మగు నయ్యది ♦ మానవునకు:
డంబుగా మెసంగిన నౌష ♦ ధంబు గూడఁ
దెవులుఁ గలిగించి కరము బా ♦ ధింప కున్నె? ౩౭

బుద్ధిబలమె బలం బగు; ♦ బుద్ధిహీన
బలము దలపోయ బొత్తిగ ♦ వ్యర్థ మగును:
బుద్ధిబల మున్నశశకంబు ♦ పూర్వ మల్ల
సింహమును బావిలోఁ గూలఁ ♦ జేయ లేదె? ౩౮

కాలమున కనుకూలంబు ♦ గాని కార్య
మొనరుచును జనసౌఖ్యనా ♦ శనము నెపుడు:
హిమము తనగారు హేమంత ♦ సమయమందుఁ
జల్లగా నుండు మైపూఁత ♦ సలుపు వంత. ౩౯

కార్యసాధనవరపరి ♦ కరము లమర
మునుపె సమకూర్చి పని చేయ ♦ మొదలుపెట్టు:
అలచికిత్సకు ముందెది ♦ వ్యౌషధములు
మంచివైద్యుఁడు దా సంగ్ర ♦ హించి యుంచు. ౪౦

దోసఁగు గలుగక పూర్వమె ♦ పోసఁగ నీవు
తత్ప్రతిక్రియఁ గనుట యు ♦ క్తంబు సుమ్ము:
తనకరంబు గాలినపిమ్మ ♦ టను జనుండు
పత్త్రిముల నొంద నెమకిన ♦ ఫలము గలదె? ౪౧

తగ దోసంగు రానై యుండు ♦ తఱిని నెట్టి
బుధునకుం గూడ విపరీత ♦ బుద్ధి గలుగు:
రాముఁ డపురూప మైనయా ♦ హేమమృగము
వెంట నంటి చనఁడె యమ్ము ♦ వింటఁ దాడగి? ౪౨

ఆత్మలాభంబు కోలుకుఁ గా ♦ ర్యార్థిజనుఁడు
హేనినైన నొనర్పంగఁ ♦ బూనుఁ గాదె?
భూమిసుతఁ బొందఁగోరి శ్రీ ♦ రామనృపుఁడు
మర్కటంబులతోఁ బ్రీతి ♦ మైత్రిఁ జేసె. ౪౩

తనదుశత్రువు దనకు బాం ♦ ధవుఁడె యయిన
నతని నమ్మినఁ దప్పక ♦ హాని వచ్చు:
హరిని నమ్మి పూర్వము జలం ♦ ధరుఁడు దనదు
ప్రాభవంబును బ్రాణంబుఁ ♦ బాయ లేదె? ౪౪

వినుము నీశత్రు వొకవేళ ♦ వినయ మొప్ప
వినతుఁ డైనంతనే నమ్మఁ ♦ జనదు వాని:
ధనువు వైరిముందఱ నెంత ♦ వినత మగును
యంత హెచ్చగుహానిఁ జే ♦ యంగ నొప్పు. ౪౫

ఉచ్చదశయందు హితుఁడుగా ♦ నుండువాఁడు
హీనదశయందు జనునక ♦ హితుఁడె యగును:
పెద్దపావకజ్వాలను ♦ బెంచుగాలి
చిన్నదీపంబు నాఱుచు ♦ చున్నది గద! ౪౬

వలయునుపకారశతము నీ ♦ వలనఁ గనియుఁ
బరుఁ డగుఁ బఱుండు సమయము ♦ వచ్చునపుడు:
పిన్నతనమున లెస్సగాఁ ♦ బెంపఁ బడియుఁ
బికము తారుణ్యమునఁ గాక ♦ వితతి విడుచు. ౪౭

పగ జనించునప్పుడె పోక ♦ మిగిలి యున్న
నద్దియె మొసంగి యత్యంత ♦ హాని సేయుఁ:
గన మహాభారతసమర ♦ కారణంబు
కౌరవుల బాల్యసమయంపు ♦ వైరమె కద! ౪౮

ఎవఁడు దేనిని జేసిన ♦ నెంచఁ బడును
వాఁడు దానినె చేయుట ♦ బాగు సుమ్మి;
యొడయుఁ డేనుంగు నెక్కుట ♦ యొప్పుఁ; గాని
ఖరము నెక్కుట నగుఁబాటు ♦ గాదె యెందు?

ఏద్ది యెవనికిఁ బ్రాప్తమో ♦ యద్ది యతని
కెందును లభించు వేఱొండు ♦ చెంద దెపుడుఁ;
గడలిఁ దరువఁగ శౌరికిఁ ♦ గమల; దేవ
పతతి కమృతంబు; శూలికి♦విషమె దొరకె. ౫౦

నరున కుండుసుగుణదుర్గు ♦ ణములు వాని
మొగము వలననె తెలియంగ ♦ నగును జుమ్మి:
సుమవికాసంబు దానిగం ♦ ధమును బట్టి
దవ్వునుండియె గ్రహియింపఁ♦దగుదుము గద! ౫౧

అన్యదేశంబునందుఁ దా ♦ నధిపుఁ డయినఁ
దనదుదేశంబుననె ప్రీతి ♦ జనున కుండు:
స్వర్ణపంజరమున నుండి ♦ పాలు బువ్వఁ
దినెడుచిలుకకు వనవాస ♦ ముననె కోర్కి. ౫౨

ఏమిచేసిన నూఁకున, ♦ నెప్పు డయిన
మానవులు నైజగుణములు ♦ మాన లేరు:
తఱిగి నూఱినఁ జందన ♦ తరువు మఱియు
లశున మూల్మియువాసన ♦ లను విడుచునె? ౫౩

ఎవఁడు నే నధికుఁడ నని ♦ యెఱుఁగఁ జెప్పు
కొనును వాఁ డల్పుఁ డని యెంచు♦కొనుము మదిని:
గొప్పశ్రీరంగనీతులు ♦ చెప్పువాని
యాచరణ మెన్న నీతిబా ♦ హ్యముగ నుండు. ౫౪

గుణిగుణంబుల నాలించి ♦ కూళుఁ డీర్ష్య
నంది యతనికిఁ గీడు చే ♦ యంగ నెంచు:
కీరమృదువాక్యముల నాల ♦ కించి పిల్లి
దానిఁ బగచేత వధియింపఁ ♦ బూనును గద! ౫౫

దుష్టమానవసహవాస ♦ దోషమునను
శిష్టుఁడు స్వకీయసుగుణాళిఁ ♦ జెఱచుకొనును:
ముసిఁడిగింజతోఁ గలయుత ♦ ప్పునను జేసి
పంచదార యగును విష ♦ ప్రాయముగను. ౫౬

సంతతార్యాళిసాంగత్య ♦ మెంత యున్న
దుర్జనుఁడు పాయఁ డాత్మీయ ♦ దుర్గుణములు:
దినసహస్రంబు పాలలో ♦ మునిఁగి యున్న
బొగ్గు తననల్లఁజాయను ♦ బో విడుచునె? ౫౭

ఏది యెవ్వానిమనమున ♦ కిష్ట మగునొ
దానినె యతండు గొను నింద్య ♦ మైన నద్ది:
మంచిమైపూఁతలను శూలి ♦ మాని ప్రియము
దగఁ జితాభస్మమును మేనఁ♦దాల్పఁ గాదె? ౫౮

తనకు నపకార మొనరించి ♦ నను సుజనుఁడు
గినియ కొనరించుఁ జామి యుప ♦ కృతిని నెపుడుఁ
గోఘునకు గడ్డిని నొసంగి ♦ కొట్టు చున్న
మంచిపాలును యది యిచ్చు ♦ మించు ప్రేమ. ౫౯

తనకు నుపకృతిఁ జేసినం ♦ దాని మఱచి
ఖలుఁ డెపుడు నపకారంబె ♦ సలుపు చుండుఁ
పామునకు క్షీరము నొసంగి ♦ ప్రేమ లాల
నమ్ముఁ జేసిన నద్ది వి ♦ షమ్మె యిచ్చు. ౬౦

పరఁగఁ గోటీశుఁ డై యున్నఁ ♦ బరమలోభి
చిల్లిగవ్వైనఁ గుడువంగ ♦ నొల్లఁ డకట!
పాడుఁగునను యుండి యొకపాల ♦ బొట్టు నైనఁ
దాగ కన్నట్టికొణుఁజుచం ♦ దంబు గాను. ౬౧

కత్సేతుఁడు చేయ నెంచినం ♦ గొప్పకార్య
మతని కపకీర్తియె లభ్య ♦ మగును జుమ్మీ
యబలుఁ డొక్క మహావ్రతం ♦ బాచరింప
సాగిన న్వానికిం దను ♦ శ్రమమె కలుగు. ౬౨

పరుల కుపకారమును సలు ♦ పక, నిజోద
రమును కనుఁగొనునీచుండు ♦ బ్రతుకు టేల?
జనులయెంగిలికూడును ♦ దినుచు దీర్ఘ
కాల మిల మనియెడుమాల ♦ కాకిపగిది. ౬౩

అరయ నుపకారి కపకార ♦ మాచరించు
నాతఁ డత్యంతనీచుండె; ♦ యట్టివాని
కంటె నెంగిలియంబలి ♦ గంజిఁ ద్రాగి
మందఁ గాచెడిశుని వేయి ♦ మడుఁగు లెచ్చు. ౬౪

వినుము నీచునకుం జెడ్డ ♦ పనివడువున
మంచిపని యింపుగా నుండ ♦ దెంచ మదిని:
మద్యము రుచించువిధమున ♦ మంచియావు
పాలు రుచియించునే మద్య ♦ పాయి కెపుడు? ౬౫

నీచజనునకుఁ జను విచ్చి ♦ నిలుపుకొనిన,
వాఁడు విడువక నడునెత్తి ♦ పైకి నెక్కుఁ:
కుక్కఁ గడుఁ జేరఁ దీసినఁ ♦ గొంక కద్ది
సామిమూతిని నాకంగ ♦ సాగ కున్నె? ౬౬

అధమజనునకు నధికార ♦ మబ్బె నేని
వాఁడు గర్వించి ప్రజలకు ♦ బాధ సేయు:
నహుషునకు వేల్పుఱేనిత ♦ నంబు గలుగ
దర్పమున వాఁడు మౌనిచి ♦ త్తంబుఁ గలఁచె. ౬౭

తనకు నెంతవిత్తం బున్నఁ ♦ దనివి గనక,
పిసినివాఁ డన్యులధనంబె ♦ మెసవ నెంచు:
నన్నపానంబు లొంది హ ♦ ర్మ్యమున నున్నఁ
గుక్క యెంగిలిపుల్లలఁ ♦ గోర కున్నె? ౬౮

అల్పజనుఁడును మహదాశ్ర ♦ యంబువలన
గౌరవంబును మెందు గాఁ ♦ గాంచు నిజము:
నార వరగంధకుసుమాళిఁ ♦ జేరి యొప్పుఁ
గాదె నరపాలమస్తక ♦ గళములందు? ౧౯

మూర్ఖజనుఁ డయఃఖండంబు ♦ పోలెఁ దగుఁ బ్ర
తాపమున వంగు; శీతల ♦ త్వమున బిగియుఁ;
దాడనంబున గుణవృద్ధి ♦ దప్ప కొదవు;
విడిచిపెట్టఁ బనికి రాక ♦ చెడును గాదె? ౨౦

జూద మాడిన దోషంబుఁ ♦ జేదతికముఁ
గలుగుఁ; గావున విడువంగ వలయు దాని:
ధర్మవిదులైననలరాజ ♦ ధర్మసుతులు
పొందినదోసంగులఁ జెవుల ♦ విందుము గద! ౨౧

సురా మదిని జెఱచి యకాల ♦ మరణము నతి
పాపము నొనర్చుఁ; గానఁ ద ♦ త్పాన ముడుగు:
శక్రుఁడును యాదవాళియు ♦ సురను దా
మందమతు లయి త్వరగానె ♦ మ్రింద లేదె? ౨౨

వేఁట క్రౌర్యంబు నెఱపి వి ♦ వేక ముడిపి
నరక మొనఁగూర్చుఁ; గాన మా ♦ న నగు దాని:
వేఁటతమకంబునఁ గదా వి ♦ వేకహీను
లగుచు దశరథపాండువుల్ ♦ హాని గనిరి. ౨౩

[illegible]లఁ గోఁపట ♦ పాతకంబుఁ
బ్రాణసంకటమును; గాన ♦ వారిఁ గనకు:
మధికబలశాలి—వాలియు ♦ నసురధవుఁడు—
రావణుఁడు నొందినగతు లా ♦ రయుము నీవు. ౨౪

సత్యహీనుని నమ్మరు ♦ జగతి జనులు;
వాఁడు శాశ్వతనరకంబు ♦ వడయుఁ జుమ్మి;
యొండుకల్లకే ధర్మసూ ♦ నుండు నరక
దర్శనము చేసెఁ; గావునఁ ♦ దగ దనృతము. ౨౫

అబలకు న్వశ్యుఁ డైనన ♦ రాధమునకుఁ
బౌరుషము పోవు; నపకీర్తి ♦ వచ్చుఁ జుమ్మి:
చంద్రకులజుఁడు—రాజమ ♦ హేంద్రుఁ డతుల
చారిత్రుఁ డని యిల ♦ దూఱఁబడఁడె? ౨౬

జనులగుణములఁ బరికింప ♦ శస్త మైన
కాల మరయ వారలకష్ట ♦ కాలమె కద!
పసిఁడిఁ బరికింప నెంచిన ♦ పక్షమునను
దాని నిప్పునఁ గాల్చుట ♦ తగును జుమ్మి. ౨౭

తాను దిను, మఱి యొరులకు ♦ దాన మిచ్చు
ధనమె తనది; దాఁచుధనంబు ♦ తనది కాదు:
తేనెటీఁగలు గడుఁ బ్రయ ♦ త్నించి కూర్చి
తినక దాఁచుతేనియ యగు ♦ జనులపాలు. ౨౮

విఱ్ఱవీఁగకు నీ కున్న ♦ విభవ మెప్పుడు
నుండు నని; దాని నిలుకడ ♦ నిండు సున్న:
వాయుచలితప్రదీపిక ♦ వడువున సిరి
స్థిరత లేమిఁ జంచల యనఁ ♦ బరఁగుఁ గాదె? ౭౯

ఆశ సంసారి కుండిన ♦ నమరుఁ; గాక
యద్ది దుష్పూర్వమైనచో ♦ హాని గలుగుఁ:
గాకి నది దాఁటఁ గడఁగినం ♦ గడఁగుఁ గాక!
జలధి దాఁటఁ గడంగినం ♦ జావ కున్నె? ౮౦

మంచి చెడ్డ గా మఱి చెడ్డ ♦ మంచిగాను.
గాలమునుబట్టి మాఱుట ♦ గందుము గద!
పా లజీర్ణంబున విషంబు ♦ పగిది నగును;
గరళ మలజన్ని నమృతంబు ♦ కరణిఁ దగును. ౮౧

దుష్టభావంబు గలవాని ♦ దృష్టి కెపుడు
దుష్టము గనె ప్రపంచంబు ♦ దోఁచుఁ జుమ్మి:
సకలవస్తువులును బైఁడి ♦ ఛాయ గానె
కనఁబడును గాదె? కామాల ♦ గల నరునకు. ౮౨

పెనుదొసఁగు గల్గినంతనె ♦ పిఱికివాఁడు
వడఁకు; ధైర్యము గలవాఁడు ♦ [illegible]కఁడు సుమి:
చండవాయువు వీచిన ♦ వృక్షగణంబు
గదలు; క్ష్మాధరం బెప్పుడును ♦ [illegible] కద! ౮౩

పరిచయం బెక్కువైన నా ♦ దరము తగ్గుఁ;
పరిచయము తక్కువైన నా ♦ దరము హెచ్చు!
నిల్లటప్పుటల్లునకుఁ బెఱ ♦ యల్లునకును
గలుగునాదరము లతివి ♦ ఖ్యాతము లిల. ౮౪

మఱొకపదవిని గన్నపి ♦ మ్మటనె మనుజుఁ
డున్నపదవిని విడుచుట ♦ యుక్త మగును:
నడచునప్పు డానకయె ముం ♦ దడుగున నిల
వెనుకపాదంబు నెత్తిన ♦ వెసఁ బడుదుము. ౮౫

ఒక్కప్రాణంబు గలయథ ♦ రోష్ఠయుగ్మ
మన్నకబళంబుకొఱకు వే ♦ ఱగుచు నుండ
బంధుమిత్రులు గాంచంగ ♦ బ్రతుకుఁదెరువు
దూరదేశంబులకు నేగ ♦ దుఃఖ మేల? ౮౬

నీతిగీతితతి రచించి ♦ ప్రీతి మీఱ
నర్పణము చేసె భక్తితో ♦ నచ్యుతునకుఁ
గృష్ణచంద్రదేవవసుంధ ♦ రేశసూనుఁడు—
ధీరనుతకర్మ—విక్రమ ♦ దేవవర్మ. ౮౭

సంపూర్ణము.



